శ్రీరస్తు.

శ్రీసీతారామ ఐకమత్యత సంఘగ్రంథ

# శ్రీ సీతారాముల

16

సంఘాధ్యక్షులు

సూర్యదేవర సంజీవరాయుణా

 తుమ్మపూడి.



ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్

బెజవాడ.

1922.

వెల రు

నాద్వితీయ జనకుడు, సకల జ్ఞాన సంపన్నుఁడు, గర్వవిసర్జనమును గుఱించి బోధించినట్టి వారును, వ్యవసాయపాండిత్యుఁడు; భక్తిపరుడు, సకలసుజనవిధేయుడు, కొద్దికాలముక్రిందటనే స్వర్గారోహణమొనరించిన సూర్యదేవర సంజీవరాయుఁడుగారి ద్వితీయతనయుడునైన

జోగయ్యశాస్త్రికి

ఈపొత్తము సమర్పితము.



ఇట్లు

సంజీవరాయ

## శ్రీ సీతారామ ఐకమత్యత సంఘము.

సోదరులారా!

భక్తిమార్గమునకు దారిజూపు గ్రంథముల ప్రచురింపవలెనని నాచిన్ననాటనుండియూహ యుండియు తగిన సహాయము లేక, కొన్నిచిక్కులచేత నాగితిని. ఆలస్యము చేయుట తగదని యెన్నిచిక్కులున్నను కార్యమునకై పూనితిని. ప్రథమమున శ్రీరామస్మరణమహిమ వ్రాసితిని. నావయస్సు పదియుదొమ్మిది సంవత్సరములు. వ్యాకరణ ఛందస్సుశాస్త్రముల నెరుగను. వినికిడివలనను స్వల్పగ్రంథములు చదువుటవలనను గలిగిన జ్ఞాన సహాయముతో వ్రాసితిని. ఇందున్న తప్పులను సవరించి యొప్పులుగా మార్చుకొని పరిపూర్ణకరుణను జూపుదురుగాక.

సంజీవరాయణం

అవిఘ్నమస్తు

శ్రీరాముల సహాయమ్ము

# శ్రీ సీతారాముల మహాత్మ్యము

శా॥ శ్రీమద్దివ్య నిజాంఘ్రిపద్మములు సం♦సేవిం
పుచుఁ భక్తిచే। ధీమంతుండగు నాంజ
నేయుని నస♦ద్దేహేంద్రియాతీతచి। ద్ధ్యా
మానందుఁడ వీవ నేనని కృప♦న్బోధించు
శ్రీజానకీరామబ్రహ్మము నంతరంగమున
నా♦రాధింతు నశ్రాంతముఁ।

క॥ శ్రీమద్రఘువంశార్ణవ
సోమా శ్రీరామనామ ♦ సువ్రితకామా
కోమలదేహశ్యామా
శ్రీమద్భద్రాద్రిధామా ♦ శ్రీరఘురామా॥

## నమస్కారములు.

శ్రీసీతారామాంజనేయ గోవిందోహరి.

శ్రీ భద్రాచల రామగోవిందో హరి.
శ్రీ పండరిపురనివాసగోవిందో హరి.
శ్రీ వాయుసుత గోవిందో హరి.
శ్రీ రామకృష్ణగోవిందోహరి.

హరి రంగ హరి. హరి రంగ హరి.

శ్రీ సీతాపతే! ఆహా! ఓ జానకీరామ! నీ నామస్మరణ చెవుల కెంతయింపుగా నున్నది. దేహమంతయు నీనామస్మరణతో లీనమయినట్లు పులకరించినది. ఎంతయానందము! జే సీతారామ గోవిందోహరి. హ, ప్రతిమానవుని నీవ

శము చేసికొనునంతశక్తి నీ నామస్మరణచే
గలిగియున్నది. నీకీర్తనంబు విన్నమాత్రంబ
ననే యీస్థూలదేహంబునకె ఎన్నోనగలతో
నలంకరించినట్లు ఆనందమగుచుండగా సర్వ
వ్యాపించు సూక్ష్మశరీరంబున కెంత పరమా
నందము కలుగునో తెలియకున్నది.

జగన్మోహనాకారా! నీ నామముచే
పిపీలికాది జంతుసముదాయంబుతో నిండినట
వంటి జగమునంతయు నింపి సూత్రధారుడవై
నటనచేయుచుంటివి.

శ్రీరామా! నీవు సర్వలోకరక్షకుడవై
యుండియు మానవుడైన దశరథమహారా
కుమారుడవై, శ్రీరామస్వామియని నాః

ముద్రించి జనక మహారాజుయొక్క యల్లుడ వై సీతయను నామంబుగల లక్ష్మిని పరిణయం బై దుష్టులైన మారీచరావణులను సంహా రించి, శిష్టులైన అహల్యా, సుగ్రీవ, విభీషణా దులను బ్రోచి యుగంబులన్నిటిని శ్రీరామ స్మ రణతో నింపి సకలపాపంబులనుండి విముక్తుల చేయుచుంటివి. నీనామమైన శ్రీరామ అను పేరునకు అర్థమే సకలజనుల దుష్కృతంబుల ను తొలగించుచున్నది.

శ్లో॥ రాశబ్దోచ్చారమాత్రేణ।
ముఖాన్నిర్యాంతిపాతకః।
పునః ప్రవేశభీత్యాచ।
మకారస్తుకవాటవత్ ॥

అనుప్రమాణమునుబట్టి "రా" అను నక్షరము పలికినంతమాత్రంబున సకలపాపం

బులు బయటికిపోవును. "మ" యనునక్షరము పలికిన యే పాపము లోనికిప్రవేశింపకుండా కవాటము మూతవేయబడును. కాన నీనామ మైన రామ శబ్దార్థంబు సకలజనులపాపంబు లుపారద్రోలుచున్నది అని పెద్దలువచించిరి. ఎచట జూచినను నీభక్తులేకదా! నీస్మరణాన్న అయస్కాంతము దూరముననున్నయినుమును తనదగ్గరకు లాగుకొనునట్లు నీభక్తులను నిన్ను విడనాడకుండాచేసి, విద్యుత్ప్రవాహమువలె సర్వత్రవ్యాపించుచున్నది. ఏమానవుని నోటి నుండివచ్చు వాక్కువిన్నను "రామకృష్ణగోవిందనారాయణ, కృష్ణరామగోవింద నారాయణ" యనియే వినబడుచున్నది శ్రీరామ నవమి యెంతమాహాత్మ్యముగలది. ఎచట జూచినను శ్రీరామభక్తులేగదా.

ఓరామ! నీనామస్మరణవల్లనేగదా భక్తు
డైన రామదాసు జెరసాలనుండి విడిపించితివి.
భద్రాచలమును వన్నెకుదెచ్చి, కోటానుకోట్ల
జనులను నీవద్దకురావించుకొనుచుంటివి. కబీరు
దాసు తన గృహమునకు కొందఱు బైరాగులు
ఆకలిచేరాగా తనవద్దనేమియులేనివాడై ఒక
షావుకారువద్ద తనభార్యను తాకట్టుపెట్టి వల
యు పదార్థములు తెచ్చి వారిని భుజింపజేసి
తనభార్యను షావుకారువద్దకు పంపగా రంగ
ము ముదరగా నీవుకొత్వాలురూపంబున వచ్చి
పరమపతివ్రితయైన కబీరు భార్యను రక్షించి
సావుకారును శిక్షించి లోకమున కంతకు పర
స్త్రీని కోరగూడదని నీతిగరపితివి. నిన్నుస్మరిం
చిన మోక్షంబును గలుగును. ఇక నీభక్తులను
ప్రార్థించిన కూడను మోక్షంబుసిద్ధించునని తా

తగారువచించిరి. లోకమునకు హితంబుగా నొక గ్రంథము వ్రాయసమకట్టి, శ్రీసీతారామాంజనేయుల పరమభక్తుడైన వాసిరెడ్డి వేంకటసుబ్బదాసుగారు నిర్జనప్రదేశమందు నిశ్చలమనస్కుడై యాంజనేయునిప్రార్థింపగా ప్రత్యక్షమై "నీవుప్రార్థించిన సంగతి తెలిసినది. నీకు మోక్షంబుకలుగును. శ్రీసీతారాములకు అంకితమిచ్చి యేదియైన నొకగ్రంథమువ్రాయుము. మనోరథుడవుకాగల"వని వచించి అదృశ్యుడాయెను. కావున నీయొక్కనామస్మరణవల్ల ప్రతివారియందు నీవుంటున్నావు. వారికి వశమగుచున్నావు. పరీక్షించిచూడ నీనామకీర్తనంబె ఘనమని విశదమగుచున్నది. 'కాని మఱియేదియుగాదు.

సీ॥ క్షితి యేఘనంబని ♦ చెప్పెదమంటిమా
శేషుండు మోచునా ♦ క్షితితలంబు
శేషుండె ఘనమని ♦ జెప్పెదమంటిమా
కాలకంఠుని చేతి ♦ కంకణంబు
కాలకంఠుడెమహా ♦ ఘనుడని యంటిమా
కైలాసగిరిమీద ♦ కాపురంబు
కైలాసగిరిమహా ♦ ఘనమనియంటిమా
యెపుడు రావణుం ♦ డెత్తినాడు
రావణుడేమహా ♦ రణశూరుడంటిమా
కరమొప్ప వాలిచే ♦ కట్టువడియె
వాలి యేఘనుడని ♦ వచియింతమంటిమా
యొక్క బాణము చేత ♦ నొఱిగినాడు
అభీమశరమెమ ♦ హాఘనంబంటిమా
శ్రీరామచంద్రుని ♦ చేతిలోది

కడగి శ్రీరాముడే ♦ ఘనుఁడనియుంటిమా
దాసులహృదయాన ♦ దగిలినాఁడు.

రామా! సర్వలోకరక్షకుడవై జీవులన్నిటిని పుట్టించుచు గిట్టించుచు యుండియు నీవు నీభక్తులకు వశ్యుడవై హృదయములందెల్లప్పుడు నివసించు చుంటివిగదా; ఏమి! నీనామ స్మరణమహిమ! ఆకలి దప్పికలుండవుగదా! నీనామస్మరణ శ్రీరామ శ్రీరామ శ్రీరామ అనునది పంచభక్ష్యపరమాన్నములకన్న నెక్కుడురుచిగానున్నది.

రామదాసుగారిని మండు వేసంగిలో తానీషా యిసుకతిన్నెలమీద నిలువంబెట్టించగా, తనకాళ్లుకాలక చల్లగానుండగా శ్రీరామ నామమహిమను యిటులవర్ణించిరి.

రాగము- గౌళపంతువరాళి- ఆదితాళము

శ్రీరామ నీనామ మేమిరుచిరా - ఓరామ- నీనామ మెంతరుచిరా ॥శ్రీ॥ కరిరాజ ప్రహ్లాద తరణిజ విభీషణుల- గాచిననీనామ మేమిరుచి రా॥శ్రీరామ॥కదళీఖర్జూరాది ఫలములకన్నను పతితపావననామ మేమిరుచిరా॥శ్రీరామ॥ దధి ఘృత మధురస ఫలములకన్నను- పతితపావన నామ మేమిరుచిరా॥శ్రీరామ॥ నవరసపరమా న్న నవనీతములకంటె- నధికమౌనీనామ మేమి రుచిరా॥ శ్రీరామ॥

ఈ మాదిరిగా రామదాసుగారు పాడు చున్నారు.

తుచ్ఛమైన స్థూలశరీరంబును వృద్ధిపరచు టకు వట్టిపిప్పియగు పంచ పరమాన్నములు

ఫలములు భుజించుటకన్న యెల్లప్పుడు శ్రీరామ నామస్మరణ చేసిన సూక్ష్మశరీరంబును తృప్తి చెందింప చేసిన మోక్షంబు గలిగి యీలోకంబునకు కీర్తి పరలోకంబునకు ముక్తి గలుగునని కబీరు రామదాసు మొదలైన భక్తులును త్రిమూర్తులలోని రుద్రుడును వచించి యున్నారు.

(శివుడు) పరమేశ్వరుడు పార్వతీదేవికి శ్రీరామనామస్మరణ మాహాత్మ్యము శ్రీసీతా రామాంజనేయ సంవాదమను రూపంబున జెప్పియున్నారు. శివుడు శ్రీరామమంత్రి మాహాత్మ్యమును వర్ణించుటకు తనకు తరముకాదని వచించియున్నాడు.

తే॥ గీ॥ రామతారకపావన ♦ రామనామ
మెంత పాపంబు నడగించు♦నంతయాఘము

శ్వపచుఁడైననుఁ జేయఁగాఁ జాలఁడనగఁ
దత్ప్రభావంబు నెన్నంగ దరమెనాకు॥

కుక్కమాంసము వండుకొని భుజించు మాలవాఁడైనను శ్రీరామమంత్రము జపింప వచ్చుననునపుడు ఆ మంత్రమాహాత్మ్యమును వర్ణించుటకు తనకునలవికాదని చెప్పియున్నారు.

క॥ ఏ పాపమునైనఁదగం
బాపగలదు రామనామభజనపరునకుం
బాపము గలదని పలుకు మ
హాపాతకియఘమునడఁప నదియోపదిలన్॥

మహాపాపంబులన్నిటిని శ్రీరామమంత్రము సంహరింపగలదుగాని రామనామము చేసినంత మాత్రంబున పాపంబుపోగలదా? అను పాతకి పాపంబు మాత్రము పోజాలదు.

శ్రీరామమంత్రంబును ఏ మానవుడైన జపించినగాని వారు యేదికోరుదురో దానినిచ్చునని చెప్పుచున్నారు.

సీ॥ ధర్మార్థులకు సర్వ♦ధర్మంబులొసగూర్చు
నర్థార్థులకుఁ జేయు♦నర్థములనుఁ
గామార్థులకు నెల్ల♦కామంబుల నొసంగు
నాత్మజార్థులకిచ్చు♦నాత్మజులను
శ్రీశ్రుతిస్మృతియశ♦శ్శ్రేయస్సుఖత్వమా
విద్యార్థులకువాణి♦వెలయనిచ్చు
ఛత్రిచామరగజా♦శ్వపరిభృత్యార్థుల
కవియు సంపాదించు♦ననవరతము

తే॥ గీ॥ ఇంద్ర సూర్యాలయంబుల♦స్వర్గలోక
సత్యవైకుంఠ కైలాస♦సదనములను
గోరువారల కవియు జే♦కూరఁ జేయుఁ
రామనామంబు విలసిల్లి♦రాజవదన॥

గీ॥ రామ! రామ! యటంచును గామకుండు
మోహమున బ్రియసినిఁబిల్వ మోక్ష మొసగు
రామనామంబు హిమశైల రాజతనయ
గానవర్ణింపఁ గాజాల దాసిమహిమ॥

(శ్రీ సీతారామాంజనేయ సంవాదము)

రామయని మోహము చెందియున్న వాడు తన ప్రియసిని పిలిచిన మోక్షంబు ప్రాప్తించును. కాన శ్రీరామమహిమ వర్ణింప నెవరితరమగును.

సుజనులారా! శ్రీరామ, రామ, రామ, యని యెల్లప్పుడు భగవన్నామస్మరణచేయుడు. మూడుకాసులు ఖరీదుచేయని యీ స్థూలశరీరంబె నిత్యంబని యహంకారముతో

నెల్లప్పుడు గర్వంబు చెందకుడు. ఈస్థూలశరీ
రంబు నిత్యంబుగాదు. సూక్ష్మశరీరంబు
జీవుడు నిత్యము. అనిత్యంబగు స్థూలశరీరంబు
తుచ్ఛమైన కోరికలగోరుచుండు. అన్నియు
తనకే కావలయునను మితిలేని యాశగలిగి
యుండును. తన్నుతాను చెరుచుకొనుచుం
డును. స్థూలశరీరంబు శాశ్వతముకాదు. ఏ
నిమిషముననో, ఏఘడియనో, ఏరోజుననో
గతించుట నిజమైయున్నది. సూక్ష్మశరీరము
నశింపదు. ఎన్నినిమిషములైనను, ఎన్నిఘడి
యలైనను, ఎన్నిరోజులైనను, ఎన్ని నెలలైనను,
ఎన్నిసంవత్సరములైనను నశింపక యొక చోటి
నుండి మఱియొక చోటికి పోవుచు శాశ్వతి
ముగా నుండును. నశింపులేదు. భగవంతుడు
సర్వత్రి వ్యాపించియున్నట్లు జీవుడుకూడ వ్యా

పించియున్నాడు. జీవుడు కోరునది ముక్తి కీర్తి కాంతలను. ఎల్లప్పుడు పరమాత్ముని స్మరణ యే కోరును. కాని స్థూలశరీరంబు అడ్డుపడి కొన్ని చెడునడతలందు ప్రవేశింపచేయును. కావున స్థూలశరీరంబు నిత్యమని నమ్మక భగవంతుడైన శ్రీరాముని మంత్రమును ఎల్లప్పుడు స్మరింపుడు. కీర్తింపుడు. భజనచేయుడు. సర్వజనులకు తెలియబరచుడు. ముక్తి కీర్తి కాంతలను పొందుడు. కామక్రోధలోభమద మాత్సర్యంబులకు లోబడకుడు. వీనినన్నిటిని పారద్రోలి నిరంతరము సుఖమనుభవింపచేయు శ్రీరామస్మరణయను మందుకొనుడు. రామదాసుగారు తానీషావల్ల సకలకష్టము లనుభవించి శ్రీరామనామస్మరణవల్ల కడతేరెను. ప్రహ్లాదుడు, తనతండ్రి శ్రీమన్నారాయణుని

స్మరణ చేయవలదని యెన్నిపీడలుపెట్టినను విడువక శ్రీనారాయణస్మరణచేయుట వల్ల బాధలుపొందక ముక్తికీర్తి కాంతలను పొందెను. ధృవుడుకూడను బాల్యమందు విష్ణుమూర్తిని ప్రార్థించి మోక్షమును పొందెను.

కావున జనులారా! సకల పాపంబులను సంహరించు రామజోగి మందుపుచ్చుకొని ముక్తికీర్తి కాంతలను పొందుడు. రామదాసుగారు చెరసాలనుండి శ్రీసీతారాములకరుణ వల్ల విడుదలైవచ్చి శ్రీరాముని మహిమను పామరులకు తెలిపినవిధము.

రాగము-నాదనామక్రియ-ఆదితాళము

రామజోగిమందు కొనరే - పామరులారా-
రామజోగిమందుకొనరే॥ రామజోగిమందు

మీరు ప్రేమతో భజియించునప్పుడే - కామ
క్రోధముల నెల్ల కడకు పాఱఁద్రోలెమందు॥
రామ॥ మదమాత్సర్య లోభములను మాట
లోనిలిపెడిమందు - గుదిగొన్న కర్మములను
గూడకొయెడఁద్రోలెమందు ॥రామ॥ కాటుక
కొండలవంటి కర్మములెడఁబాపెమందు - సాటి
లేదు జగమునందు స్వామి రామజోగిమందు
॥రామ॥ కోటిధనములిత్తునని కొనబోయిన దొ
రకనిమందు - సాటిలేని భాగవతులుస్మరణఁ
జేసితలచేమందు ॥రామ॥ ముదముతో భద్రా
ద్రియందు ముక్తి నిపొందించేమందు - సదయు
డైన రామదాసు సద్భక్తితోఁ గొలిచేమందు॥
రామ॥

(రామదాసు చరిత్రము.)

## ముక్తికీర్తికాంతలను పొందువిధము.

1 ఎల్లప్పుడు శ్రీమన్నారాయణునిస్మరణ జే
యుడు.

2 విష్ణులీలలు, భగవద్భక్తిబోధించు గ్రంథ
ములు చదువుడు.

3 హరికథలు, భజనలు సల్పుచోటికేగి యాల
కింపుడు.

4 సత్సాంగత్యము చేయుడు.

5 సత్యము పల్కుడు.

6 ధర్మముచేయుడు.

7 శాంతముగా నుండుడు.

8 హింస చేయకుడు.

---

సంపూర్ణము.

# శ్రీ సీతారామ ఐకమత్యత గ్రంథమాల.

---

సోదరులారా!

ఈసంఘమందు 'భక్తిమార్గము' ఐకమత్యత, వ్యవసాయములను గురించి చిన్ని గ్రంథములను రెండు నెలల కొకసారి ప్రచురింపదును. గ్రంధమాల వృద్ధిపరచుటకై, చందాదారులుగా చేర ప్రార్థించెదను.

సంవత్సరచందా:—రూ. ౧-౪-౦

సహాయులు వ్రాయిష్టము.

తుమ్మలపూడి, దుగ్గిరాలపోష్టు గుంటూరుజిల్లా.

ఇట్లు,
సూ. సంజీవరాయడు

## —:రాబోవు ప్రచురణ:—

సోదరులారా!

రాబోవు ప్రచురణ నిమిత్తము 'వ్యవసాయము' ను గురించి అనగా పైరులు వేయుటకు స్థలము, యెరువులు, వాటికి నీరు, విత్తులు, యేపైగువల్ల లాభము గల్గును అనునంశములతో 30 పేజీలలో వ్రాసిపంపిన దయతో నంగీకరింతుము.

సంపాదకుడు.

